## సింక్యియాంగ్‌లో అశాంతి

భారత ప్రభుత్వమునకు చిక్కు

న్యూఢిల్లీ ఏప్రిల్ ౧౮

సింకియాంగు రాష్ట్రములో తిరుగుబాటు జరుగుచున్నదని, అచటి పరిస్థితులు ఇంకను చక్కబడలేదు. కొన్ని ప్రదేశములలో కొల్లకొట్టు జరుగుచున్నది. వారు తిరుగుబాటు చేయుచున్నారు.

## రైల్లు రాకపోకలు

H E H ది నైజామ్సు స్టేటు రైల్వే

(పెద్దలైను)

### చేరుట

| | సికింద్రాబాదు (బి జి) గం. ని. | హైద్రాబాదు గం. ని. |
|---|---|---|
| నం. 11 ఖాజీపేట-హైద్రాబాద బి జి. ప్యాసింజరు | 6-28 . | 7-03 (బి) |
| నం. 2 వాడీ-బెజవాడ ప్యాసింజరు | 7 54.. | 8-27 |
| నం. 1 బెజవాడ హైద్రాబాద ప్యాసింజరు | 13-10 .. | 13-46 (ఎ) |
| నం. 10 పర్లి విజయవాడ్-సికింద్రాబాద ప్యాసింజరు | 20-30 , | 19-43 |
| నం. 8 హైద్రాబాద-బెజవాడ ప్యాసింజరు | 3 0 . | 14 30 |

### వెళ్లుట

| | సికింద్రాబాదు | హైద్రాబాదు |
|---|---|---|
| నం. 9 సికింద్రాబాద-పర్లి విజయవాఢ్ ప్యాసింజరు | 7-21 . | 7-57 |
| నం 2 వాడి-బెజవాడ ప్యాసింజరు | 8-57.,. | 8--10 |
| నం. 12 హైద్రాబాద బి జి-ఖాజీపేట ప్యాసింజరు | 19-50 | 19-0 (బి) |
| నం. 1 సికింద్రాబాద-వాడి ప్యాసింజరు | 17-10... | 17-46 (బి) |
| నం.7 బెజవాడ-హైద్రాబాద ప్యాసింజరు | 19-41 . | 2036 |

(చిన్న లైను)

### చేరుట

| | సికింద్రాబాదు (ఎ జి) గం. ని. | హైద్రాబాదు గం. ని. |
|---|---|---|
| నం. 31 మన్మాడ్-హైద్రాబాద యం జి. ప్యాసింజరు | 6-56. | 7-40 |
| నం. 35 ద్రోణాచలం-సికింద్రాబాద-ప్యాసింజరు | 19-12 | 18-44 |
| నం. 33 మన్మాడ్-హైద్రాబాద ఎం.జి. ప్యాసింజరు | 20-41. | 21-10 |
| నం. 27 ద్రోణాచలం సికింద్రాబాదు ప్యాసింజరు | 6-0. | 5-20 |

### వెళ్లుట

| | సికింద్రాబాదు | హైద్రాబాదు |
|---|---|---|
| నం. 34 హైద్రాబాద ఎం జి. మన్మాడ్ ప్యాసింజరు | 7-33. | .6-50 |
| నం. 36 సికింద్రాబాద-ద్రోణాచలం ప్యాసింజరు | 7-6. | 7-28 |
| నం. 32 హైద్రాబాద-యం.జి. మన్మాడ్ ప్యాసింజరు | 20-0... | 19-15 |
| నం. 28 సికింద్రాబాదు ద్రోణాచలం ప్యాసింజరు | 21-25. | .21-45 |

నోటు:—

(ఎ) హైద్రాబాద బి.జి. చేరక ముందు సికింద్రాబాద వెళ్లును, తిరిగి సికింద్రాబాద నుండి 17-20 గంటలకు హైదరాబాదు బయలుదేరును

(బి) ఈబండ్లు ఖాజీపేటలో ఢిల్లీ, మద్రాసు మధ్యవచ్చు వెళ్లు గ్రాండుట్రంక్ యెక్స్ ప్రెస్ బండ్లతో, వాడీ బెజవాడమధ్యగల మిక్సడ్ బండ్లతో కలుపును

గోలకొండపత్రిక

(జాతీయ అర్ధవారపత్రిక)

హైద్రాబాద

చందా వివరములు

సంవత్సరమునకు రు ౬-లు

అర్ధసంవత్సరమునకు రు ౩-లు

విడిప్రతిక ౧ అణా

గోలకొండపత్రిక

బహుధాన్య నామ సంII చైత్ర బII ౬

గురు వారము

# ధాన్యాది విక్రయ శాసనము అమలు

మన రాష్ట్రమందు వ్యవసాయకులు పండించు ధాన్యాదులకు అనేక కారణములచే మంచిధరలు గిట్టకుండ అన్యాయము జరుగుచుండుట జూచి, మన ప్రభుత్వమువారు ఆలోపములను తొలగించుటకై "ధాన్యాది విక్రయ శాసనము" (అగ్రికల్చరల్ మార్కెట్ అక్టు) అను నొక శాసనమును గావించి క్రమక్రమముగ రాష్ట్రమంతటను అమలు పరచుచున్నారు ఈశాసనమందు వ్యవసాయకుల సరకులకు తగిన ధరలు లభించుటకు ఆటంకములుగనున్న వాటిని తొలగించు ఏర్పాటులు నిబంధించబడియున్నవి

అట్టి ఈ శాసనముయొక్క అమలుకు సంబంధించిన ౧౩౪౬ మరియు ౧౩౪౭ ఫ.ల నివేదికలు మా కార్యాలయము నలంకరించినవి. ఈ శాసనముయొక్క అమలు సంబంధమైన పనిని జరిపించుటకై ప్రత్యేకముగ నొక శాఖ ఏర్పరచబడి యుండగా, ౧౩౪౭ ఫ.లో రెండేండ్ల క్రిందటి నివేదికలు వెలువడుట సమంజసము గాలేదు. ముందునుండి ఇంకను శీఘ్రముగ సకాలమున నివేదికలను ప్రకటింప గలరని ఆశించుచున్నాము,

ఈ రెండు నివేదికల కాలమందును ధాన్యాది విక్రయశాసనము యొక్క అమలులో వ్యవసాయకులకు ఉపయోగకరము లైన ఏర్పాట్లు ఎన్నటివలెనే చేయబడియుండెను. ౧౩౪౬ ఫ లో మొత్తముపై ౯ మార్కెట్లలో ఈ శాసనము అమలునందుంచబడెను. ౧౩౪౭ ఫ. అంతమునకు ఈశాసనమునకు లోబడిన మార్కెట్లసంఖ్య ౧౦ కి హెచ్చెను. మార్కెటు కమిటీల సమావేశముల సంఖ్య ౫ మార్కెట్లలో ౧౩౪౬ ఫ.లో కంటె ౧౩౪౭ ఫ.లో తగ్గెను. రెండు మార్కెట్లలో ఎట్టిమార్పుగాని లేకయుండెను, ౧౩౪౭ ఫ లో జాల్నా మార్కెట్ కమిటీయొక్క ౮ సమావేశములను, హింగోలి మార్కెట్ యొక్క ౯ సమావేశములను కార్యక్రమము నడిపించుటకు అవసరమగు హాజరుకావలసినంతమంది సభ్యులు హాజరుకాని కారణముచే జరిగియుండలేదు.

ధర్మాదాయములనుగూర్చి మంచి కట్టుదిట్టము చేయబడినది. ధర్మాదాయములకు సంబంధించిన లెక్కలను స్పష్టముగా ప్రత్యేకముగా నుంచుటకు ఏర్పాటు చేయబడినచోట్లయందే ధర్మాదాయము వసూలు చేయబడుచుండెను అట్టి ఏర్పాటు లేనిచోట ధర్మాదాయము వసూలు చేయబడనీయలేదు. ధర్మాదాయము వసూలు చేయబడుచోట్లలో ఆ నిధుల నిర్వహణకై ప్రత్యేకములైన ఉపసంఘము లేర్పాటు చేయబడెను. ఆ నిధులనుండి ఖర్చు చేయుటకు ముందు మార్కెటు కమిటీల అనుమతి పొందవలసినట్లును నిబంధన చేయబడినది. ఉద్గిర్ లో ఆస్పత్రినిధి లెక్కలు పరీక్షలకు సరిగా లభించబడకుండెనను కారణముచే ౧౩౪౭ ఫ.లో అక్కడ ఆనిధికై వసూలుచేయబడనియలేదు. హింగోలిలో "సేవాసదనము యొక్క పాఠశాల"లు గలవు నుంచబడినవి, అందులో సగము మార్కెట్లకు సరకులను అమ్ముటకై వచ్చువారలచేతను, తక్కిన సగముకొనువారలచేతను చెల్లించబడునట్లు ఏర్పాటు చేయబడెను. అసలు ఈ ధర్మాదాయమును వానినే రైతులనుండి విధిగా వసూలు చేయుపద్ధతియే మాకు ఇష్టము కాదు.

నివేదికల కాలములో వ్యవసాయకుల లాభమునకై చేయబడిన ఇంకొక ఏర్పాటేమనగా వ్యవసాయకుల నద్దనుండి తీసికొనిన సరకుల ఖరీదును వెంటనే చెల్లించునట్లు చేయుట. ఇంతవరకును కొన్ని మార్కెట్లయందు వ్యవసాయకులవద్దనుండి మధ్యవర్తులు సరకులు తీసికొని పెద్దవర్తకులకు అమ్ముచుండెడివారు. కాని పెద్దవర్తకులు మధ్యవర్తులకు వెంటనే సరకుల క్రయము చెల్లించకుండుటచే, మధ్యవర్తులు వ్యవసాయకులకు వెంటనే క్రయము చెల్లించవలసినచో, ఆ క్రయమునుండి కొంత తగ్గించి ఇచ్చుచుండెడివారు. ఇపుడు అట్లుగాకుండ వ్యవసాయకుడు పూర్తి క్రయము పొందకలుగునట్లు చేయబడినది- సరకును కొన్నవారు దాని క్రయమును కొన్నరోజే ఇవ్వవలెనను నిబంధన అమలు చేయబడినది.

ఇంకొక లాభకరమైన ఏర్పాటు ౧౩౪౭ ఫ.లో చేయబడినది. శాసనము యొక్క రెండవ దఫాలో ప్రభుత్వము వారికి "వ్యవసాయ సంబంధమైన సరకు" క్రింద ఏవేవిచేసునో ప్రకటించుటకు అధికార మీయబడియున్నది. ౧౩౪౦ ఫ. లో తదనుసారము ౧౮ వస్తువుల పేర్లు ఆ పట్టికలో చేర్చబడియుండెను. కాని ఇట్లు ప్రకటించబడని వస్తువు లనేకము లు గింజులోకి వచ్చుచుండుటయు, అవి వ్యవసాయకులకు చాల ముఖ్యమైనవిగ నుండుటయు గమనించి ప్రభుత్వము వారు విచారణచేసి మరి ౨౮ సరకులను ఆ పట్టికలో చేర్చిరి. ఇట్లు అ ౨౮ వస్తువుల విక్రయమందుకూడ వ్యవసాయకులకు ధాన్యవిక్రయ శాసనమువలని లాభము నచ్చునట్లు చేయబడినది.

తర్వాత వ్యవసాయకులనుండి కొనబడు సరకుల పరిమాణము, కొన్నవారి పేరు మున్నగు విషయములుగల రసీదులను మార్కెటు కమిటీ అధికారులు పరీక్షించి, అందులో లోపములవలన వ్యవసాయకులకు నష్టము కలిగించబడియుండినచో ఆ నష్టపడినదానిని ఇప్పించిరి. ఇట్టి పరీక్షచే ఖాతాలు, లెక్కలు సరిగా నుంచవలెనను శ్రద్ధకలిగించ బడినది. ఇదియు వ్యవసాయకులకు ఉపకరించు ఏర్పాటే. ధరల విషయములో వివాదములను పరిష్కరించుటకు నియోగించబడిన మధ్యవర్తిసంఘములుకూడ సంతృప్తికరముగ పనిచేసినట్లు ౧౩౪౭ ఫ. నివేదికలో చెప్పబడినది.

సరకులు కొన్ని మార్కెట్లలో తూచబడుటయు, కొన్ని మార్కెట్లలో కొలవబడుటయు గలదు. అందుచే నివేదికలో ఒక టేసరకుల విషయములో సెంటు ఒకటె లెక్కప్రకారము సరిచూచి వేయబడినవి ఈ ధరలు మార్కెట్టులలో వ్యవసాయకులకు లభించిన ధరలను తెలుపును, అన్నిమార్కెట్లలోను తూకపురాళ్లను, కొలతపాత్రలను ఒక్కతీరున నుండునట్లు చేయుమార్గమును మార్కెటింగుశాఖవారు విచారించుచున్నట్లు రెండు నివేదికలలోను తెలుపబడినది ఇది పరిష్కారమైనపుడు వ్యవసాయకుల కెంతయో న్యాయముకలుగగలదు. ప్రస్తుతమునకు అంత తీవ్ర చర్యనువదలి, వ్యవసాయకులకు విపరీతమైన అన్యాయము కలుగకుండ, ఉన్న ఏర్పాట్లలో చిన్నకట్టుదిట్టములు, సవరణలు చేయబడినవి,

ప్రస్తుతము రెండు నివేదికలలోను తెలియవగు ఒక క్రొత్త విశేషమేమన, ఇండియా ప్రభుత్వమువారు భారతదేశమంతటను వ్యవసాయ సంబంధములైన సరకుల విక్రయ సౌకర్యముల గూర్చి పరిశీలన చేయుటకై అనుకొనిన పద్ధతి ప్రకారము మన రాష్ట్రమునకు సంబంధించిన పనిని పూర్తి చేయుటయందు తోడ్పడుటకు మన ప్రభుత్వమువారు పూనుకొని, ఇందుకై ప్రత్యేక పరిశీలన శాఖ నేర్పరచి పని జరిపించుచున్నారు. దీనివలన ఎంతయో ఉపయోగకరమైన విశేషములు తెలియగలవు.

మొత్తముపై నివేదికలు ఉత్సాహకరములైన యంశములతో గూడియున్నవి. నివేదిక కాలమందు తమవిధులను సరిగా నిర్వహించినందుకు మార్కెటింగు శాఖాధికారుల నభినందించుచున్నాము.

---

# స్మారక సభ

స్థలము.—శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం

సుల్తాను బజారు

సమయము — (౧౮ వ ఖుర్దాద్ ౧౩౪౭ఫ.) శుక్రవారం

సాయంత్రము ౬ గంటలకు

విఖ్యాత ఆంధ్రనాయకులు, విశ్వదాత, దేశోద్ధారక, కళాప్రపూర్ణ శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు, దివంగతులైన సందర్భమున, ఈ క్రింది ఆంధ్రసంస్థల పక్షమున, సంతాపము ప్రకటించుటకై శ్రీయుత కొండా వేంకట రంగారెడ్డిగారి యధ్యక్షత్వములో సమావేశమగుటకు, సోదర సోదరీమణులందరు, సకాలమునకు దయచేయవలయునని ప్రార్థించుచున్నాము.

౧. మందుముల రామచంద్రరావు, ఆంధ్రమహాసభాస్థాయిసంఘం
౨. వి. శ్రీనివాసరెడ్డి, హైదరాబాదు ఆంధ్రజనసంఘం
౩. కస్తూరి కిషన్‌రావు, శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం
౪. నా. కోదండ రామరావు, బాలసరస్వతీ నిలయం
౫. కొ. సుబ్బారావు, వేమనగ్రంథాలయం

---

## సంయుక్త రాష్ట్రమందు రైతుల తిరుగుబాటు

జమీందారు ఇంటికి నిప్పంటించుట

లక్నో ఏప్రిల్ ౧౫.

సంయుక్త రాష్ట్రమందు సర్దారు విశ్వ గ్రామములలో రైతులు తిరుగుబాటుచేసినట్లు వార్తలు వచ్చినవి. అనేకులు రైతులు జమీందారులను తిట్టుచు పర్యారి గ్రామములో ఒక జమీందారు ఇంటికి తగులబెట్టిరట

ఒకవార్త ఏమనగా రైతులను జమీందారులు బాధించిరట, అందుపై వారలు జమీందారుఇంటికి తగులబెట్టిరట జిల్లాఅధికారులు ఈ అల్లరి జరిగినచోటికి పోలీసులనుపంపిరి విశ్వ గ్రామములో అనేకులు రైతులు తిరగబడి జమీందారుల సేకుల ఇండ్లను తగులబెట్టిరట.

ఇంకను విచారించగా విశ్వ గ్రామములో ౫౦౦ రైతులు ఇండ్లనుతగులబెట్టి పోలీసులను ముట్టడించిరి అంత ఒక పోలీసు సబ్ ఇన్స్పెక్టరు జిల్లా ప్రధానస్థలమునకు తెలుపగా జిల్లా మేజస్ట్రీటు పోలీసు సూపరింటెండెంటు వచ్చి పలువురిని అరెస్టు చేసిరి.

## ఆస్ట్రియా కన్యలు బ్రిటిషు భర్తలకై వెదకుట

ఆస్ట్రియా హిట్లరుక్రిందికి వచ్చినందుకు ఫలితము

లండను (టపా)

ఇపుడు బ్రిటనులో పని చేయుచున్న ఆస్ట్రియా కన్యలు, నర్సులు, టైపిస్టులు ౫౦౦౦ మంది గలరు వారలు బ్రిటిషుభర్తలకై వెదకుచున్నారు. వారలలో చాలమంది వియన్నానుండి వచ్చినవారలు, ఇటీవల హిట్లరుయొక్క ఆజ్ఞచే వారలకు జర్మను పౌరత్వము సంప్రాప్తించ చేయబడినది కాని వారలకు జర్మను పౌరత్వము ఇష్టము కాదు. వారలకు బ్రిటిషు పౌరులుగ నుండవలెనని ఇచ్ఛగలదు. కాని సాధారణముగా ఇంగ్లీషు భాషామువారలను బ్రిటిషు పౌరులుగ నుండ సమ్మతించుటలేదు కనుక బ్రిటిషువారలను పెండ్లాడినచో జర్మనీపౌరసత్వముపోయి బ్రిటిషు పౌరత్వము కలుగునను ఆశతో అట్లు చేయుచున్నారు.

## శ్రీ తాడుబందు వీరాంజనేయ స్వామి

సికింద్రాబాదు, ఏప్రిల్ ౧౫.

శ్రీ బహుధాన్యనామ సంII చైత్ర బII ౩౦ శనివారమునకు సరియగు ది. ౩౦-౪-౧౯౩౮ (౨౭-౭-ఖుర్దాదు సన్ ౧౩౪౭ ఫసలి) నాడు శ్రీ తాడుబందు వీరాంజనేయుల వార్షికమహోత్సవము జరుగగలదు. ఈ ఆలయము సికింద్రాబాదునకు సమీపమున బొల్లారములో గలదు. బెజవాడ, గద్వాల, మన్మాడ్, వాడి మొదలగు ప్రదేశములనుండియు, యింకను మహోత్సవము దర్శించిన సైకాంపర్యాటకులవారి నైవేద్యములు గలవిధప్రాంతములనుండి వారాంతము ౨౦,౦౦౦ భక్తులు వచ్చుటేగాక సుమారు ౨౫౦ భజన సమాజములవారు విచ్చేసి శ్రీస్వామివారికి మహోత్సవమునందలి భజన కాలక్షేపముల బాగైన కార్యక్రమము జయప్రదముగా కొనసాగించెదరు

పై మహోత్సవము నాటికి జనులు విచ్చేసి స్వామి కార్యమును జయప్రదముగా కొనసాగించగలందులకు సేవా మండలివారు కోరుచున్నారు.

## స్టాలిన్ పరిపాలన పడదోయు ప్రయత్నము

స్టాలిన్ పరిపాలనను పడద్రోయుటకు మాస్కోయందలి ఒక పార్టుకన్ రేడియో స్టేషనునుండి ఒకప్రచారము ప్రారంభమయినట్లు తెలియుచున్నది "లిబరేటర్సు యూనియను" అను పేరుతో రష్యామంది బ్రాడ్‌కాస్టయిన కార్యక్రమము ఒకటి, మార్చి ౨౬వ తేదీ రాత్రి వినబడినది. వ్యవసాయ సమస్య పరిష్కరించుటకు గాను "లిబరేటర్సు" ప్రజాప్రభుత్వము ఏర్పాటుచేయ ఎత్తులను వేసియున్నట్లు తెలిసినది.

## ఫ్రాన్సు కాలనీలను కబళించుటకు హిట్లరు ఎత్తా?

ఫ్రెంచి పత్రికల విమర్శలు

పారిస్ ఏప్రిల్ ౧౪

ఫ్రాన్సు, ఇటలీ సంబంధమునుగురించి ఫ్రెంచిపత్రికలు వివిధాభిప్రాయములను ప్రకటించుచున్నవి.

ఇపాక్ పత్రిక ఇట్లనుచున్నది —

"సీజర్ ముసోలినీగారు ట్యూనిస్ సరిహద్దులో సేనలను ప్రోగుచేయుచు ఇష్టమువచ్చినట్లు బెదరించుచుండ సమాధానము కోరుట ఫ్రాన్సుకు అగౌరవముగ నుండవచ్చును. కాని ముసోలినీ గారి నిజాభిప్రాయములు తెలిసినవి కనుక ముసోలినీ గారితో సమాధానము చేసికొనుటకు వీలున్నది కనుక ఫ్రాన్సు రోముకు తన రాయబారినిపంపి పరిస్థితులను సరిచేసుకొనవలెను"

"ఫ్రాన్సు దేశము చుట్టు హిట్లరు మిత్రబృందమును కూర్చుకొని ఉత్తరఆఫ్రికాలోని ఫ్రాన్సు కాలనీలను యథేచ్ఛగ కబళించుటకు కావలసిన ఏర్పాటులు చేయుటకొరకే రోమ రోమునకు పోవుచున్నాడు."

## బీహారులో సంపూర్ణ మద్యనిషేధముయొక్క అసాధారణ విజయము

కల్లుగీయువారలుకూడా విధానము నాహ్వానించుట

బీహారు రాష్ట్రములో సంపూర్ణ మద్యపాననిషేధమునకు కల్లుగీయువారలుకూడ సంతోషముతో అంగీకరించినందుకు సూచనగా ఆరాష్ట్రమందు బాబు రాజేంద్రప్రసాదు గారును, సర్దారు వల్లభాయిపటేలు గారును సంచారము చేయుచు యిచ్చిన ఉపన్యాసములు అనుకూలముగ నుండెను.

వారల ఈఉత్సాహమును గుర్తించి, వారలకు మద్యపాన సంపూర్ణ నిషేధముచే కలుగబోవు ఉద్యోగనష్టమును తొలగించుట ప్రజల విధియని రాజేంద్రప్రసాదు గారు గ్రహించక పోలేదు. ఎట్లన, వారు పోయినప్రతిసభలోను పనులలో ఖాళీలువచ్చినచోట్లెల్ల ఈకల్లుగీయువాండ్లనే నియోగించుకొనవలెనని ప్రబోధించుటను రాజేంద్రప్రసాదు గారు మరువలేదు.

మద్యపాన నిషేధ ఫలితముగా నిదివరకు ఈకాలములో పోలీసు స్టేషనులకు అధికముగా వచ్చుచుండిన నేరములు ఇపుడు వచ్చుటలేదు

## గయనగరములో రివాల్వరు ధారుల దోపిడి యత్నములు

సబ్ యిన్స్పెక్టరుపై రివాల్వరుప్రేల్చి ఆర్గురు పారిపోయిరి ఒకడు పట్టుపడెను

పాట్నా: ఏప్రిల్ ౧౬

గయలో నిన్న జరిగినను పట్టపగలు కొందరుయువకులు సాగించిన దౌర్జన్యమును గురించి యీక్రింది వివరములు తెలియవచ్చుచున్నవి. ఇద్దరుయువకులు గయనగరమునకు క్రిందటి ఆదివారము వచ్చి ఎచట దోపిడి జరుపవచ్చునో దానికి అనువైనస్థలము వెదకుకొనుటకు ఏధులలో తిరుగుచుండిరట. నిన్న వారొక మోటారును అద్దెకుతీసికొని స్వేచ్ఛగా సంచరించిరట

ఇట్లు పనిలేకుండ తిరుగుచున్నందుకు టాక్సీ డ్రైవరు అనుమానపడి మోటారును అద్దెయివ్వక నిరాకరించెను. అంతటవారు మోటారులోనుండి దిగిపోయి, రివాల్వరుచూపి డ్రైవరును బెదిరించి పారిపోయిరి.

అట్లువీరు పరుగెత్తుకొని పోవుచుండగా ౫ యువకులు, ఆయుధప్రదర్శన బ్లాంకువారందరు శ్రీహార్ట్లీవారి పెద్దలు యయుధములతో ఆటవిక్రయములను మోటారులలో వెళ్ళిరి. అంతట యీయువకులు వారిని రివాల్వరుతో బెదరించి ఆపి, అమోటారులో ఎక్కి, బ్రాహ్మణోని కొండవద్దకు మోటారు తోలవలసినదని ఆజ్ఞాపించిరి కొండ చేరగానే యువకులు దిగిపోయి, తమసంగతి పోలీసులకు తెలియపరచకూడదని సుఖేశ్వర నారాయణసింగ్ గారిని హెచ్చరించిరట.

కాని, సుఖేశ్వర నారాయణసింగ్ గారు వెంటనే పోలీసుస్టేషనుకువెళ్లి మండగించ్లు గురించి సమగ్రముగా తెలియపరచిరి. అంతట పోలీసులు, సి.ఐ.డి.ఉద్యోగులును బ్రాహ్మణోని కొండవద్దకువెళ్లి వారిని ముట్టడించిరి. అపుడు యువకులు ప్రేల్చినగుండు ఒకటి సి.ఐ.డి.సబ్ యిన్స్పెక్టరుకు తగిలినది. కూడకు పోలీసులు నంకోక్కరధర అనువకుని అరెస్టు చేసిరి. ఇతరను దీనిపై విచారణలు జరుగుచున్నవి.

నిన్న సాయంకాలము గయనగరములో ఆ సమాచారముపై యేడుగురిని అరెస్టుచేసి పోలీసు స్టేషనులోనికి తీసికొనివెళ్లినట్లును, ఆచటనుండి వారలో నొకడు పోలీసు సబ్ యిన్స్పెక్టరుపై రివాల్వరు ప్రేల్చినట్లును అటువిన్నట వారందరు తప్పించుకొని పారిపోయినట్లును యిచ్చటికి వర్తమానము వచ్చినది. వారిలో ఒకనిమాత్రము అరెస్టుచేసిరనియు తక్కినవారు కొందరు ఏదో ఒకసంబరు మోటారులో వెళ్లినట్లు తెలిసినది. గయనుండి అమోటారునంబరు తెలియగానే అన్ని పంతెనలవద్దను ఆయుధములతో రక్షకభటులు నుండిరి.

ముందట రాత్రి రాగిరటలకు యీనంబరు మోటారు సూరావాం పంతెనవద్ద కనిపించినది. అమోటారును అపి దానిని సోదాచేసిరి ఒక ఆంగ్లోయిండియను యువకుడు దానిని నడుపుచుండెను. అతనిని కరజల్‌గంజ్ పోలీసుస్టేషనుకు తీసికొనివెళ్లి వాఙ్మూలము పుచ్చుకొని వదలిరి.

## హిట్లరు సన్మానమునకై ౪ లక్షల పౌనులు

రోము (టపా)

హిట్లరుగారు రోము నగరమునకు వచ్చునపుడు వారిని సన్మానించు ఏర్పాటులకై ౪ లక్షల పౌనులు వ్యయము చేయబడుటకు నిశ్చయమైనట్లు ప్రకటించబడినది. అదేయు ఏర్పాటులన్నియు హిట్లరుకును ప్రపంచమునకును ఇటలీ యొక్క-ఒక మిత్రకొప్పదని సూచించునవిగ యుండును మరియు అనుబ్బానమువ మేర్పాట్ల ఫువర ఇటలీజర్మనీల మైత్రిబలమునకూడ ప్రపంచమునకు చాటుచుండగలందుకై విశ్వప్రయత్నములు చేయబడుచున్నవి.

# ఫెడరేషన్ విషయమై అనుమానములు, సంశయములు

## లండనులో గవర్నరులు, వైస్రాయి సంభాషించ నున్నారా?

గవర్నరులు, వైస్రాయిగారల సెలవులలో రహస్యము.
హితవాద, హిందూస్థాన్ టైమ్సుపత్రికల వ్యాఖ్యలు

హిజ్ యక్సలెన్సీ వైస్రాయిగారు ఎండా కాలములో నాలుగుసెలలు సెలవుదీసికొని పోవుచున్నారను ప్రకటనను చూచి ఎవరికిగాని దీని కంతయు చాటుగా ఏదోఒక రహస్యమున్నదని అనుమానము కలుగకమానదు —అని "హితవాద"పత్రిక అనుచున్నది.

సింధుగవర్నరు, ఒరిస్సాగవర్నరు, సంయుక్తరాష్ట్రపు గవర్నరుకూడ సెలవుపై పోవుచున్నారు. ఈ సెలవులను చూడగా లార్డు ఇర్విన్‌గారు వైస్రాయిగానుండినపుడు సెలవు దీసికొనిపోయి మరికొందరు గవర్నరులతో అందములో రాష్ట్రీయ స్వాతంత్ర్యమునుగూర్చి సంభాషణలు జరిపియుండిన సమాచారము జ్ఞప్తికి వచ్చుచున్నది.

"వైస్రాయిగారి సెలవునకును ఫెడరేషను స్థాపన ప్రయత్నములను అలక్ష్యమునకట్లు చేయుటకును ఏదో సంబంధముండవలెనని మాకు అనుమానము కలుగుచున్నది. కేంద్రశాసన సభయను అసెంబ్లీయొక్క జీవితమునందు ౧ అక్టోబరు ౧౯౩౮ నుండి మరియొక యేడాది పొడిగింపుచేయబడినది అనగా ౧౯౩౯ లోగా ఫెడరేషను ఏర్పడజాలదని అధికారులు నమ్మియున్నారని అర్థము. వైస్రాయిగారు సెక్రటరీ ఆఫ్ స్టేటుగారితో ఫెడరేషను అమలు చేయబడవిషయమును గూర్చి చర్చించవచ్చును.

* * *

ఈ ఎండకాలములో రాష్ట్రముల అధిపతులను, అఖిలభారత జేతాధిపతిని అందములో సమాలోచనపరచుట వైరసంఘటనమా, లేక అదంతయు ముందుగా అనుకొని నిశ్చయించుకొనియున్న ఒకవిధానము ప్రకారము జరుగుచున్నదా?—అని హిందూస్థాన్‌పత్రిక ప్రశ్నించుచు, ఇట్లు వ్రాయుచున్నది.

సెక్రటరీ ఆఫ్ స్టేటుగారును, హిజ్ మెజస్టీగారి ప్రభుత్వమువారును, వైస్రాయిగారియొక్కయు, గవర్నరులయొక్కయు అభిప్రాయమును తెలిసికొనగోరు ముఖ్యవిషయము ఫెడరేషను ప్రవేశపెట్టుటకుగల అవకాశము. ప్రస్తుతము నిర్ణయించుకొన్న ఫెడరేషను విధానములో ఎట్టిమార్పుగాని లేకుండ అమలుపరచుచో రాష్ట్రముల వైఖరి ఎట్లుండునో తెలిసికొనుటకుకూడ సెక్రటరీ ఆఫ్ స్టేటుగారును హిజ్ మెజస్టీగారి ప్రభుత్వమువారును సతమతమగుచుందురు. స్వాతంత్ర్యముగల రాష్ట్రములన్నియు ఫెడరేషనును ఒక్కమాటగా ప్రతిఘటించుచుండ, దానిని బలవంతముగా భారతదేశమునకు అంటగట్టుట నిజముగా గొప్ప రాజకీయోపద్రవమే యగును. వైస్రాయి, గవర్నరును ఈవిషయమును సార్వభౌముని ప్రభుత్వమునకు పరిగా తెలకెక్కించినచో, వారలు తమవిధి చేసినట్లే. అందుకువారలు దేశమునకు అభినందన పాత్రులు.

తర్వాత సార్వభౌముని ప్రభుత్వము చేయవలసినది వారిబాధ్యతను బట్టియుండును. కాని ఈ బాధ్యతతో వారలు, వైస్రాయి, గవర్నర్లు ముందుగా హెచ్చరిక చేసిన తర్వాత, ఫెడరేషనును భారతదేశముపై బలాత్కారముగ అంటగట్టుటకు తమకధికారమున్నదని మాత్రము తలచేరు లేదని మాకు నమ్మకముగలదు.

## సంస్థానాధిపతులకు ఒక్కటే శరణ్యమార్గము

ఏకచ్ఛత్రాధిపత్య పరిపాలన పద్ధతిని అదృశ్యముగ చేయించుడు అని సర్ సి. రామస్వామి అయ్యరుగారు ప్రజలకుగావించిన ఉపన్యాసముచే ఎక్కువగా అకర్షింపబడజాలరు— అని "ట్రిబ్యూను"పత్రిక విమర్శించుచు, ఇంకను ఇట్లనుచున్నది.

"భారత సంస్థానాధిపతుల భవిష్యత్తు సంపూర్ణముగా వారలపైననే ఆధారపడియున్నది. ప్రజల హృదయముల నావర్జించుటకు వారలకొక్కటే ఒక్కమార్గముగలదు. వారలు ఎవరియెడ భక్తి కలిగియున్నారో ఆ చక్రవర్తిగారిని ఆదర్శముగ నుంచుకొని శాసనబద్ధులైన ప్రభువులుగావలెను. "పరిపాలనయంతయు చక్రవర్తిగారిపేర జరుగును, కానివారు స్వయముగా పరిపాలన చేయరు." ఈ సిద్ధాంతమందే వారల క్షేమమార్గమంతయు గలదు."

## వెనుకకు తలక్రిందుగను వ్రాయగల బాలుడు

అమెరికా దేశములో చికాగో నగరములో ఫ్రాంక్ బాలె అను ౧౧ఏండ్ల బాలుడు ఇంగ్లీషుభాషను వెనుకనుండి ముందుకేగాక క్రిందినించి పైకికూడ వ్రాయగలడు. ఇది బాలమందికి ఆశ్చర్యకరముగ నుండుటచే ఆబాలుని పోయిన మార్చినెలలో "చికాగోను ఇన్‌స్టిట్యూటు అఫ్ జువెనైల్ రీసర్చి" (చికాగోలో శిశు పరిశోధన సంస్థ)లో పరీక్షించిరి. కాని కారణమేమైనది తెలియలేదు.

## అబిసీనియాపై ఇటలీ ఆధిపత్యము

ఫ్రాన్సు అంగీకరించును

పారిసు: ఏప్రెల్ ౧౫

అబిసీనియాలో ఇటలీ అధికారమును అంగీకరించి, రోములో తనరాయబారిని నియమించుటకు ముందుగా, ఆంగ్లో ఇటాలియన్ ఒడంబడికవంటి ఒడంబడికను ఇటలీతో చేసికొనుటకు ఫ్రాన్సు కోరుచున్నదని తెలిసినది.

### క్రొత్త ఒడంబడిక

ఫ్రాన్సుకు ఇటలీకి క్రొత్తగా వ్యాపార ఒడంబడిక కుదిరినది. నిన్నను రోములో ఒడంబడికపై సంతకములు జరిగినవి. ఈఒడంబడిక మేనెల మొదటి తేదీనుండి అమలులోనికి వచ్చును. ఫ్రాన్సు ఇటలీదేశములకు సమాధానము ఈవిధముగ ప్రారంభమయినది. రెండుదేశముల ప్రతినిధులుగల ఒకసంఘము రెండుదేశముల వ్యాపార పరిస్థితులను పరిశీలించుచుండును.

## మరియొక స్వాతంత్ర్య సమరము

ఈసారి సంస్థానములకుకూడ వ్యాపించును

కలకత్తా: ఏప్రిల్ ౧౭

కలకత్తానగరపు ఉత్తరభాగమునందలి కాశీపూరు, బారానగరుల నివాసులు సమర్పించిన విజ్ఞాపనపత్రమునకు సమాధానమిచ్చుచు, కాంగ్రెసు అధ్యక్షుడు సుభాసుచంద్రబోసు ఇట్లు చెప్పెను.

"కాంగ్రెసు స్వాతంత్ర్యమునకై మరియొక సమరమును ప్రారంభించవలసి వచ్చుచో,—అట్టిది కొద్దికాలములోనే సంభవించుటకు ఎంతో అవకాశమున్నది—దాని తీక్ష్ణత పూర్వముకంటె వేయిరెట్లు ఎక్కువగా నుండవచ్చును. ఎందుకన, ఆపోరాటము బ్రిటిషుఇండియా సరిహద్దులలోనుండక, భారత సంస్థానములకుకూడ వ్యాపించగలదు."

అట్టి పోరాటము విశాలవ్యాప్తమైన సత్యాగ్రహముగ నుండును. దానినడచుటకు బ్రిటిషువారి వశముగూడకాదు. అని బోసుగారు తెలిపిరి.

## కలరా భయములేదు — కలరా భీతిజెందకుడు.

కలరాకు దివ్యౌషధము

### విక్టర్ డ్రాప్స్ మిమ్ము కాపాడగలదు.

గ్రహణి, అతిసారము, కలరా రక్తవిరేచనములు, కడుపుబ్బరములు అజీర్ణము వాంతిభేదులు మొదలగువాటిని తప్పక కుదుర్చును. రెండు మూడు మోతాదులు పుచ్చుకొనినచో కలరావలన కలుగు వాంతిభేదులుకట్టుకొనును అనేకులు మావిక్టర్ డ్రాప్సును ఉపయోగించి ప్రాణముల కాపాడుకొని యోగ్యతాపత్రముల నొసగియున్నారు. కలరావ్యాధులకు వాడబడుచుండు ఔషధములలోకెల్ల మావిక్టర్ డ్రాప్స ప్రశస్తమైనదని శాస్త్రులు పొగడియున్నారు. మరియు అన్ని వయసులవారికి నిర్భయముగా వాడవచ్చును.

సోల్ యెజంట్లు: విక్టర్ అండు కో
పెద్దగడియారం హైద్రాబాద్ దక్కన్
దవాఖాన, విక్టర్ అండుకో
సుల్తానుబజారు.

## కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు

సికింద్రాబాదు జేరానివాసుల విషాదము

సికింద్రాబాదు (దక్కన్): ఏప్రిలు ౧౬.

నిన్న సాయంకాలము సికింద్రాబాదులో జేరాయందలి ఆంధ్రులు, దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ శ. నాగేశ్వరరావు పంతులుగారి మరణముచే కలిగిన విషాదమును వెల్లడించుటకై బహిరంగసభ నొకదానిని జరిపిరి. శ్రీయుత మురికరము ప్రతాపరెడ్డిగారు అధ్యక్షత వహించిరి.

ప్రతాపరెడ్డిగారు కీ॥శే॥ నాగేశ్వరరావుగారు దేశమునకు చేసినసేవను కొనియాడుచు, కీర్తిశేషుడు హైదరాబాదు ఆంధ్రులయెడగూడ ఆదరాభిమానములనుంచి, ఎన్నియోవిధముల సహాయము చేసియుండిరని చెప్పిరి. చాలకాలమువరకు ఆంధ్రులకు ఆంధ్రపత్రిక యొక్కటియే శరణ్యమై యుండెననిరి. నాగేశ్వరరావుగారు ఎన్నియో విద్యాసంస్థలకును గ్రంథాలయములకును ఉదారముగా దానము చేసి యున్నారు. వారు ఆంధ్రులను గాఢనిద్రనుండి మేల్కొల్పి, వారికనేకవిధముల సేవజేసియుండిరి. అంతేగాక వారుగొప్ప దేశభక్తులు. అట్టివారి మరణముచే దేశమునకు గొప్పనష్టము కలిగినది. ఆంధ్రులు వారుస్థాపించిన సంస్థలయందభిమానముంచి, వానినిపెంపొందించుచుండుట ధర్మమనిరెడ్డిగారు చెప్పిరి.

హైదరాబాదు సుజాతపత్రికా సంపాదకులగు బి. రామానుజాచారిగారు విషాదతీర్మానమును బలపరచుచు ఔదార్యము, ఆంధ్రాభిమానము, దేశసేవయందాసక్తి, తెలుగు వార్తాపత్రికలను, తెలుగువిజ్ఞానమునకును వారుచేసిన సేవ-ఇవి నాగేశ్వరరావుగారి గుణవిశేషములని చెప్పిరి.

కపిల కాశీపతిగారు కీర్తిశేషుని కుటుంబమునకు సానుభూతి తెలియజేయు సందపతీర్మానమును ప్రతిపాదించుచు, కీర్తిశేషుని కుటుంబముతో తమకుగల పరిచయమును ప్రస్తావించిరి. నాగేశ్వరరావుగారి అల్లుడగు శంభుప్రసాద్‌గారు ఇపుడు ఆంధ్రపత్రికా సంపాదకత్వమును బూనినారనియు, వారు పత్రికవ్యవస్థను సంస్కరించి, పత్రికను ఎక్కువవ్యాప్తి గలదానిగ చేయదలచియున్నారనియు చెప్పిరి. అప్పుడే హైదరాబాదుకు ఒక ప్రత్యేకవిలేఖరిని పంపబడియున్నాడనియు, ఈఏర్పాటుచే ఇకమీదట హైదరాబాదు సంబంధమైనవార్తలు ఎక్కువగ ఆంధ్రపత్రికలో రావలెనని ఉద్దేశమనియు చెప్పిరి. స్థానికాంధ్రులు ఆంధ్రపత్రికను ప్రోత్సహించవలెనని కాశీపతిగారు విన్నవించిరి.

సభ్యులందరును మౌనముతో నిలుచుండి తీర్మానముల నామోదించిరి.

కార్యక్రమమును ముగించుచు అధ్యక్షులవారు కీ.శే. నాగేశ్వరరావుగారియెడ "ఆంధ్రభోజ"యను బిరుదు చాల సార్థకమైనదని చెప్పిరి.

## ఇటలీ బ్రిటనుల ఒడంబడిక

గెలుపు ఇటలీదేనని జర్మనీ పత్రిక వ్యాఖ్య

ఇటలీపత్రికల అభినందించుట

ఆంగ్లో—ఇటాలియను ఒడంబడికను గూర్చి "ఇటలీ ఇంగ్లండుదేశములకుగల స్నేహము చరిత్రప్రసిద్ధమయినది. ఈ ఒడంబడికవల్ల ఆస్నేహము తిరిగి పూర్తిగను చిరస్థాయిగను సాధింపబడినదని అనుకొనుటకు ఇంకను వీలులేదు. ఈరెండు సామ్రాజ్యముల మధ్య ఈ ఒడంబడికవల్ల మంచిసంబంధము యేర్పడి క్రమక్రమముగ అభివృద్ధిఅగునని మాత్రమే అనుకొనగలము." అని డిడెర్ అంగ్రిఫ్ అను పత్రిక అభిప్రాయ మిచ్చినది.

ఈఒడంబడిక కుదురుటలో గెలుపు ముసోలినీగారిదేఅని మరొక జర్మనుపత్రిక ప్రకటించినది.

చాలకాలముగ ఇటలీఇంగ్లండుల మధ్యనుండిన విషమపరిస్థితులు ఈ ఒడంబడికతో అంతరించినవని ఇటలీపత్రికలు ప్రకటించినవి.

### స్పెయిను ప్రధాని ఇటలీ బ్రిటనుల ఒడంబడికను ఖండించుట

బార్సిలోనా: ఏప్రిల్ ౧౭.

స్పెయిను ప్రధాని నెగ్రిన్ గారు గత రాత్రి రేడియోద్వారా ఉపన్యసించిరి. పదునేను దినములకు పూర్వముకన్నను ప్రభుత్వమువారి స్థితి ఇప్పుడు చాల వరముగనున్నదని వీరు తెలిపిరి. పోయిన ఇరువది దినములలో ప్రభుత్వమువారికి ఎక్కువ యుద్ధపరికరములు టాంకులు చేరుటచే దీనికి కారణము యుద్ధ పరిస్థితులు ఎట్లు మారునో ప్రభుత్వమువారు ముందుగానే గమనించిరనియు, యుద్ధపరికరములకుగాని, అహారములకుగాని కొరతలేదనియు వీరు తెలిపిరి.

ఆంగ్లో-ఇటాలియన్ ఒడంబడికను వీరుతీవ్రముగ ఖండించిరి. దీనివలన స్పెయినులో ఇటలీ చేయుజోక్యమును బ్రిటను అంగీకరించినట్లయినదనియు వీరు పలికిరి.

## పోలీసులు జీతముల నిరాకరించుట

జీతముల తగ్గింపుచే ఆగ్రహము

నాగపూరులో తక్లిలైన్సులో ప్రత్యేకముగ నుంచబడిన మధ్యరాష్ట్రపుపోలీసులు మార్చినెలజీతములను తీసికొన నిరాకరించినారు. వారల అలవెన్సులను తగ్గించుటచే వారలు అగ్రహముచెంది ఇట్లుచేసినారు. తగ్గింపులను తొలగించుటకై వారలు ప్రభుత్వమువారికి విన్నవించుకొనినారు.

మధ్యరాష్ట్రప్రభుత్వమువారు, ప్రభుత్వము యొక్క ఖర్చులను తగ్గించుముద్దేశ్యముతో "యకానమీకమిటీ" అను దానిని ఏర్పాటు చేసియుండిరి. ఆకమిటీవారి సిఫారసులను బట్టి "హెడ్ కానిస్టేబిలుల అలవెన్సులలో ఒకరూపాయివంతునను, కానిస్టేబులుల అలవెన్సులలో అర్ధరూపాయ చొప్పునను తగ్గింపు చేయబడెను.





## గోలకొండపత్రిక విడిప్రతుల విక్రయ కేంద్రములు

హైద్రాబాద
1. గణపతిభవన్, ఆబిదురోడు.
2. గులాందస్తగీర్ బుక్సెల్లర్సు, వికారజహాహోటల్.
3. భారతి వస్తుభాండార్, సుల్తాన్ బజారు, చావుడి.
4. ఆంధ్రశ్రీకంపెని, రాంకోటు.
5. కే.సి. వీరేశంగారు సుల్తాన్ బజారు
6. కర్నాటక న్యూస్ ఏజన్సి ఇసామియాబజారు
7. చందానారాయణశెట్టి బుక్ సెలరు, చార్ కమాన్.

సికింద్రాబాద
1. ఇ. నర్సింలు, న్యూస్ యేజెంటు, 108 జేమ్సుస్ట్రీటు. —చీఫ్ ఏజంటు.
2. శ్రీరామా బుక్ డిపో మార్కెటుస్ట్రీటు.

## ఆర్థిక పారిశ్రామిక పరిశీలన

బొంబాయి ప్రభుత్వమువారు
ఉపసంఘమును నియోగించుట

బొంబాయి: ౧౪ ఏప్రిలు

బొంబాయి ప్రభుత్వమువారు బొంబాయి రాష్ట్రమందు ఆర్థిక, పారిశ్రామిక పరిశీలన చేయుటకై సర్ పురుషోత్తందాస్ ఠాకూర్దాస్ గారి అధ్యక్షతన నొక ఉపసంఘమును నియోగించినారు. ఈఉపసంఘమందు పారిశ్రామిక వ్యాపారాధ్యక్షులును రెండు కళాశాలలలో ఆర్థిక ప్రొఫెసర్లును గలరు. మొత్తము అధ్యక్షునితో కలిసి ౧౦గురు సభ్యులున్నారు.

ఉపసంఘము విచారించి తేల్చవలసిన విషయము లీక్రిందివిధముగ సూచించబడినవి:—

౧. రాష్ట్రములో చిన్నపరిశ్రమలు ప్రస్తుత మెట్లున్నవో పరీక్షించి వ్యవసాయమునకును పెద్ద పరిశ్రమలకును వాటి సంబంధ మెట్లున్నదో నిశ్చయించవలెను.

౨. పోయిన ౧౭ ఏండ్లలో రాష్ట్రమందు ఆర్థికాభివృద్ధికై బొంబాయి ప్రభుత్వమువారు చేసినపనిని ముఖ్యముగా వ్యవసాయమునకును పెద్దపరిశ్రమలకును, చిన్నపరిశ్రమలకును సంబంధించిన దానిని పరిశీలించుట.

౩. రాష్ట్రములో ఆర్థికాభివృద్ధిని ప్రోత్సహించుటకును అందుకు తగినధనము లభించు మార్గములను సూచించుటకును ప్రభుత్వమువారు గైకొనదగిన చర్యలను తెలుపుట.

౪. మరియు రాష్ట్రములో ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ఇతర సూచనలు చేయుట.

ఉపసంఘమువారు అక్టోబరు మాసాంతము దాటకుండ ఈలోగా సాధ్యమైనంతత్వరలో నివేదికను ప్రచురించుటకు కోరబడినారు.

## స్పెయినులో వైప్లవికుల విజయములు

ప్రభుత్వమునకు గొప్ప నష్టములు

సారగోసా, ఏప్రిల్ ౧౫

జనరల్ అరండాస్ (విద్రోహ సేనాని) గారి సేనలు మెడిటరేనియన్ తీరమునవున్న వినరోజ్ నగరమును ప్రవేశించినవి. స్పెయినులోని ఇతర భాగములనుండి కెటలోనియా రాష్ట్రమునకు పోవు రైలుమార్గములు, రోడ్డు ఈ పట్టణముతో పాటు విద్రోహుల చేతులలో చిక్కుకొనినవి.

సారగోసా: ఏప్రిల్ ౧౪

టిరటు నగరమునకు పశ్చిమమున అయిదు మైళ్ళ దూరమునవున్న ప్రెయొగ్విరా నగరము విద్రోహుల వశమయినది. విద్రోహులిప్పుడు మెడిటరేనియన్ తీరమునకు పదిమైళ్ళ దూరమునన్నారు. రెండు కొటలమీదుగ విద్రోహులు సముద్రతీరమువైపుకిపోవుచున్నారు.

The only Leading National Bi-weekly of the Andhra Provinces.

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA The only out-standing effective medium for the ventilation of views and grievances of 70,00,000 Andhras of the Premier State

Volume 12 Hyderabad-Dn. Thursday 21 April 1938 Number 97

## అబిసీనియాలో బ్రిటను హక్కులకు అభయము

జాతిసమితిచే అబిసీనియాపై ఇటలీ ఆధిపత్య మంగీకరింప జేయుటకు బ్రిటను ఒప్పుదల

స్పెయినులో ఇటలీ ఆర్థిక రాజకీయహక్కులను మానుకొనుట

బ్రిటను ఇటలీల ఒడంబడికపై సంతకము జైనవి

రోము: ఏప్రిల్ ౧౭

రోములోని వ్లాజాచిగిలో నేటిసాయంత్రము అరున్నరగంటలకు ఇటలీ బ్రిటనుల ఒడంబడికపై సంతకములు జరిగినవి.

ఈ ఒడంబడిక మూడుభాగములు. మొదటిది ప్రధానభాగము. రెండవది రెండుపక్షములవారు ఓకరికొకరు వ్రాసుకొనిన జాబులు. మూడవది ఇరుగు పొరుగు మైత్రికొరకు చేసుకొనిన ఒప్పందము.

### సంధిలోని ముఖ్యాంశములు

౧ ఉభయులలో ఎవరయిన ఒకరు మధ్యధరా సముద్రములో కాని, ఎర్ర సముద్రములో కాని క్రొత్తగా కోటా, విమానాశ్రయములు కట్టదలచిన యెడల రెండవవారికి ముందుగా తెలియ జేయవలెను.

౨ సౌది అరేబియా, యమెన్ దేశముల స్వాతంత్ర్యమును రెండుపక్షములవారు గౌరవించవలెను.

౩ ఒకరికొకరు హానిచేయు ఉద్దేశ్యముతో ప్రతికూల ప్రచారము చేయుకూడదు.

౪ ఎర్రసముద్రములోని దీవులలో ఉభయులలో ఎవరుకూడా అధికారము స్థాపించుకొనకూడదు. కాని మక్కాకుపోవు యాత్రికుల ఆరోగ్యమును కాపాడుటకొరకు కామరాన్ లో బ్రిటిషు ఉద్యోగులు ఉండుటకు ఇటలీ అభ్యంతర పెట్టరాదు.

౫ అబిసీనియాలోని టానాసరస్సువిషయమై ఇటలీ ప్రభుత్వము ఇదివరకు చేసిన వాగ్దానమున్నది. ... విషయమునుబట్టి బ్రిటనునకుగల హక్కులయెడల ఇటలీకిగల బాధ్యతను ఇటలీ ప్రభుత్వము జ్ఞాపకముంచుకొనును.

౬ ఇర్వు ప్రభుత్వములవారు సూయెజ్ కాలువను యధేచ్ఛగా వాడుకొనవచ్చును.

౭ నావికా నిర్మాణమునకు హద్దు ఏర్పరచుటకై లండనులో జరిగిన నౌకాసంధి షరతులను పాటించుటకు ఇటలీ అంగీకరించినది.

### స్పెయినుసమస్య

స్పెయినులో విదేశ సైనికుల విషయమై బ్రిటిషు ప్రభుత్వమువారు ఏర్పరచిన సూత్రమును ఇటలీ అంగీకరించినది. స్పెయినుయొక్క యుద్ధము ముగియులోగానే స్పెయినులోని ఇటలీ సైనికుల నందరిని పిలిపించుటకు ఇటలీ అంగీకరించినది. అట్లు జరుగనియెడల స్పెయిను యుద్ధము ముగిసినవెంటనే ఇటలీసైనికులనందరిని ఇటలీ యుద్ధపరికరము లన్నింటినితప్పించుటకు ఇటలీ అంగీకరించినది

స్పెయినులో తనకెట్టి రాజకీయ, ఆర్థికహక్కులుకూడ అవసరము లేదని ఇటలీ ఒప్పుకొనినది.

ఒడంబడిక ఆచరణలోనికి రాకముందే స్పెయినుసమస్యను పరిష్కారము చేయవలెనని బ్రిటను కోరినది. జరుగబోవు జాతిసమితిసభలో అబిసీనియా సమస్యను పరిష్కారము చేయ ప్రయత్నించుటకు బ్రిటను ఒప్పుకొనినది.

### ఈజిప్టుతో ప్రత్యేక సంధి

ఈ ఒడంబడిక ఆచరణలో పెట్టబడిన తేదీని రెండు ప్రభుత్వములవారు నిర్ణయించెదరు.

ఒడంబడిక ఆచరణలోనికి వచ్చినతరువాత ఈజిప్టు ప్రభుత్వముతో సంప్రదింపులు జరిపి ఇటలీ తూర్పు ఆఫ్రికా దేశమునకు, సూడాన్ కెన్యా బ్రిటిషు సోమాలిలాండు దేశములకుగల సరిహద్దును నిర్ణయించెదరు.

ఈజిప్టుతో సంబంధముగల సమస్యలపై ఈజిప్టురాయబారి సంతకము చేసెను.

## మైసూరుకాంగ్రెసు జాతీయ పతాక సత్యాగ్రహము

౫ గురు అరెస్టుచేయబడుట

హర్తాలు జరుపుటకు విన్నపము

బెంగుళూరు: ఏప్రిల్ ౧౬

జాతీయ పతాకస్థాపనను నిషేధించు ఉత్తరువు నతిక్రమించినందులకు నేటి ఉదయము పట్టాభాధ్యాయ పండిట్, (శివమొగ్గా) రాంలాల్ తివారి (బెంగుళూరుమునిసిపలు కౌన్సిలరు) గార్లను, మరిముగ్గురను మైసూరుపోలీసు రెగ్యులేషను ౩౯ వ సెక్షనుప్రకారము అరెస్టు చేసిరి.

నేటి ఉదయము కాంగ్రెసు ఆఫీసునుండి పండిత తివారిగార్ల నాయకత్వమున ఒక ఊరేగింపు బయలుదేరినది. జాతీయ పతాకము ఎగురవేయరాదని డిశంబరు ౨౫ వ తేదీన మేజిస్ట్రేటుగారు కావించిన ఉత్తరువు నతిక్రమించినందులకు పండిట్ గారిని పోలీసు ఇనస్పెక్టరు అరెస్టు చేసెను. పండిట్ అరెస్టు తరువాత శ్రీయుత లలిత జి. ఆర్ స్వామి బి. యం. సీనప్ప, శీతారామయ్య, రాంలాల్ తివారి గార్లు సత్యాగ్రహము సలిపిరి. వీరిని కూడ అరెస్టు చేసిరి

ఈ ౫ గురిని అరెస్టు చేసిన పిదప ఊరేగింపు కట్టాయముననిదరి ముఖ్య వీధులగుండా వెళ్లెను. రేపు సంపూర్ణముగు హర్తాలు జరుప వలెనని వాలంటీర్లు విజ్ఞప్తి కావించుచున్నారు రేపు పతాక సత్యాగ్రహదినము చేయవలెనని మైసూరు కాంగ్రెసు కమిటీవారు తీర్మానించియుండిరి.

### కాంగ్రెసు కార్యకారిణీ సంఘనిర్ణయము

బెంగుళూరు: ఏప్రిల్ ౧౫

శివపురాయందు పతాక సత్యాగ్రహము జరుప మైసూరు కాంగ్రెసు కార్యకారిణీ సంఘమువారు తీర్మానించిరి. సంఘమువారి సలహాల ప్రకారము కార్యక్రమము నేర్పాటు చేయు తగవారు రామచంద్రరావుగారిని నియమించి యుండిరి.

శివపురాయందు జాతీయ పతాకమును నెలకొల్పరాదనుచు జిల్లా మేజిస్ట్రేటుగారు ప్రకటించిన నిషేధాజ్ఞ పట్ల అసమ్మతి తెలుపుచు సంఘమువారు తీర్మానము చేసి యుండిరి.

నాయకులను అన్యాయముగ అరెస్టుచేసి శిక్షలందుంచినందులకు ఆక్షేపణ తెలుపుటకు ఏప్రిల్ ౧౭ వ తేదీని సంస్థానమునందంతటను సంపూర్ణ హర్తాలు జరుప వలయునని కార్యకారిణీ సంఘమువారు మైసూరుప్రజలకు విజ్ఞప్తి కావించుచున్నారు

## ప్రభుత్వోద్యోగులు దేశీయ దుస్తులుదరించుటకనుమతి

ఒరిస్సాప్రభుత్వాజ్ఞ

కటకం: ఏప్రిల్ ౧౭

ప్రభుత్వోద్యోగులు యూరోపియన్ దుస్తులలోనే ఆఫీసులకు రావలెనను నిర్బంధము లేదనియు, జాతీయదుస్తులు ధరించి హాజరు కావచ్చుననియు, ఒరిస్సా ప్రభుత్వమువారు ఉత్తరువులు జారిచేసినట్లు తెలిసినది.

## అంతర్జాతీయ కార్మిక మహాసభ

న్యూఢిల్లీ: ఏప్రిల్ ౧౭

జూన్ ౨ వతేదీని జనీవాలో సమావేశమగు ౨౪ వ అంతర్జాతీయ కార్మిక మహాసభకు ఈ క్రిందివారు భారతదేశపు ప్రతినిధులు.

౧ మిల్లుయజమానుల ప్రతినిధి—లాలా శ్రీరామ్‌గారు. వీరికి సేటు కాంతిలాల్ మంగళదాసు గారు సలహాదారుడు.

౨ కార్మికుల ప్రతినిధి— ఎస్. వి పరుశరాంగారు. ఎస్. గురుస్వామిగారు, వీరి సలహాదారుడు.

ప్రభుత్వ ప్రతినిధులపేర్లు తర్వాత ప్రకటింపబడును.

## బొంబాయిలో ఘోరమైన కొట్లాటలు

౫ మరణములు, ౭౦ మందికి గాయములు

అంతయు కొన్ని గంటలలోనె

వెంటనే పోలీసులు కొట్లాటల నణచుట

బొంబాయి: ఏప్రిలు ౧౬.

నేటి సాయంకాలము ౬గంటలవేళ ఈనగరమందు పార్సుట్రాక్ గార్డన్సులో కొందరు హిందువులను ముసల్మానులను పేకాట ఆడుచు ఇంతలో ఒకరినొకరు దూషించుకొనసాగిరి. ఇదకిది దెబ్బలాటగా పరిణమించెను. ఒకరిపైనొకరు రాళ్లురువ్వుకొనిరి, కారలు త్రాగి కొట్లాడుచున్నట్లుగూడ చెప్పుదురు.

ఈకొట్లాట అప్రదేశమందు కొంత ..యమును జనింపజేసెను. వెంటనే హిందువులు ముసల్మానులు కొట్లాడుకొనుచున్నారను వదంతి వ్యాపించెను. జనులు గుంపులు చేరసాగిరి. పోలీసులు వెంటనేవచ్చి గుంపులను చెదరగొట్టిరి. కాని హిందువులు ముసల్మానులు కొట్లాడుకొనుచున్నారను వదంతులు అగక ప్రసరించుచుండుటచే అక్కడక్కడ దెబ్బలవల్ల గాయపడినవారలు సుమారు ౧౨మంది రాత్రి ౧౦గం అగుసరికి అస్పత్రిలో చేర్చబడిరి. కొట్లాట ప్రారంభమైనచోటనే ఒకట్రాము కారు నడచుచుండగా దానిపాటి దానిలోపోవుచున్న ప్రయాణీకులను కొట్టిరి. నేడు భార్యాయచుండివచ్చిన కే. యం. మున్షి గారు పోలీసుకమీషనరుగారికి ఈ అల్లరిని ప్రారంభదశయందే తలదొత్తకుండ అణచివేయుటకు ఆజ్ఞ గావించిరి.

రాత్రి ౧౧గంటలవేళకు పరిస్థితి అన్యాయమైనట్లు ముగ్గురి మరణములవలనను రెండువది గాయపడుటవలనను విశదమయ్యెను. భీతాహము మరింత వేగముగా వ్యాపించసాగెను. కాని అధికారులు వెంటనేచక్కగా నిని అల్లరులు పైదొని సూళ్ళజాను ప్రాంతములనుండి దాటకుండ క్రమపడి కట్టుదిట్టములు చేసిరి, ఈప్రాంతములో ట్రాములనుఆపి ప్రయాణీకులను తన్నుచుండుటవలన ట్రాములు ఈప్రాంతమునకు రాకుండ చేయబడినవి. బస్సులలో ప్రయాణము చేయుచుండు ప్రయాణీకులు కూడ ఇట్లే బాధించబడుచుండిరి ఇతరములైన బండ్లలో పోవుచుండినవారలుకూడ ఇట్లేదెబ్బలుతినిరి. ఒకవిక్టోరియాలో రంజి ఈఫిలిం కంపెనీలో ఉద్యోగముననున్న భీమాబాయిఅను ఒకఫిలింనటి పోవుచుండగా అమెను తణ్కిందికిలోని కత్తిపోట్లు పొడిచిరి, అమెను మూడుపోట్లతో అస్పత్రికి చేర్చిరి.

అదివారమగుటచే కె. ఇ. .. స్పిటలులో ఉద్యోగులు అంతంతకు హెచ్చుచున్న ఈ గాయపడిన వారలసంఖ్యను ఠట్టుకొనలేక క్రొత్తగా నర్సులను డాక్టర్లను పిలిపించ వలసి వచ్చెను.

హోంమంత్రియగు మున్షీగారు ఎప్పటికప్పుడు పరిస్థితులను తెలిసికొనుచునే యుండెను. వారికి శరీరము అస్వస్థతముగా నున్నను, కొట్లాటలు ప్రారంభమైనట్లు తెలియగానే, వారు అల్లరిప్రాంతమునకు ప్రధాన రాజధాని మేజిస్ట్రేటు ఖండల్వాలా గారితోను, డిప్యూటీపోలీసు కమిషనరుగారితోను పోయిచూచి, అల్లరులు ఎక్కువగుచున్నట్లు తోచగానే, పోలీసు అధికారులతో నాలోచించుటయేగాక, సైనికాధికారులతోకూడ ఆలోచించిరి. అందరును ఇట్లు కలిసి ఆలోచించి, ఎప్పటికైనను అవసరమగునో సేనలను సిద్ధముగానుంచుటకు నిశ్చయించుకొనిరి. ప్రధానరాజధాని మేజిస్ట్రేటుగారు క్రిమినల్ ప్రొసీజరుకోడు ౧౪౪ దఫాక్రింద ఆయుదుగురికంటె ఎక్కువమంది వీధులలో గుంపుగాకూట చేరరాదని యాజ్ఞ చేయుచుండెను. ఈయాజ్ఞ ౧౪ రోజులవరకు అమలులో నుండగలదు. రాత్రి ౧౦ గంటలవేళనుండి తెల్లవారి ౬ గంటలవరకు వీధులలో తిరగరాదను ఆజ్ఞగూడ అమలు చేయబడినది ఆయుధములను ధరించుటగాని, జమచేయుటగాని, పంచుటగాని, నిషిద్ధమను ఆజ్ఞగూడ జారిచేయబడినది. అంతేగాక దుర్మార్గులను వారలను వెంటనే పట్టుకొనుటకు పోలీసులకు అజ్ఞయొసగబడినది. అట్లుపట్టుకొన్నవారలను వేరేసలమేర్పాటు చేయవలసినదని పూనాలో జైళ్లఇన్స్పెక్టర్ జనరల్ గారికి తెలియజేయబడెను. జిల్లాలనుండి అదనముగా పోలీసులు రప్పించబడిరి.

### పోలీసులు కాల్పుట

రాత్రివేళ, కొట్లాడుకొనుచున్న గుంపులను తరిమివేయుటకై పోలీసులు రెండుమార్లు కాల్పవలసివచ్చెను. కాని అకాల్పువల్ల ఎట్టినష్టము సంభవించలేదు.

ప్రధానరాజధాని మేజిస్ట్రేటు ఖండల్వాలాగారును, హోంమంత్రి మున్షీగారును, పరిస్థితులు పూర్తిగా అధికారుల వశములోనికి వచ్చువంతవరకు అర్థరాత్రివరకు గలభా ప్రాంతములలో తిరుగుచునేయుండిరి.

అర్ధరాత్రి అల్లరులు చల్లబడినను, అదరుదు చల్లబడలేదు. అల్లరి జరుగని తక్కిన ప్రదేశములలో జనులు, ఎప్పటివలెనే ఆరుబయట హాయిగా నిద్రించుచుండిరి. వారలకు ఆరాత్రి అల్లరుల సమాచారమే తెలియదు. నగరములో పోలీసుదళ మంతయు అల్లరిచోట చేర్చబడెను. మాథెరానులో సెలవుపైనున్న పోలీసు కమిషనరు స్మిత్సుగారికి వెంటనే రావలసినదని తంతిపోయినది.

బొంబాయి: ఏప్రిల్ ౧౮

పోయినరాత్రి అల్లరులచే మొత్తముమీద ౫ గురు చంపబడిరి. ౭౦ మందికి గాయపడినవారలు.

బండ్లు తిరుగుచున్నవి. కాని పోలీసు కట్టుదిట్టములు మారలేదు. గలభాజరుగవచ్చునని అనుమాన మున్నచోట్లయందు జాగ్రత్తగా గమనించుచున్నారు. మున్షీగారు స్వయముగా అంతయు విచారించుకొనుచున్నారు.

అక్కడక్కడ ముగ్గురుని కొట్టుటతప్ప మరేమియు నేడు జరుగలేదు. నిన్నరాత్రి కత్తిపోట్లు తగిలినవారలిద్దరు నేడు అస్పత్రిలో చచ్చిరి. పోలీసువారలు ౨౦౦ మంది దుష్టులను అరెస్టు చేసినారు.

### నాయకుల అభయము

ప్రధానమంత్రి బి. జి. ఖేరుగారును, హోంమంత్రి కె. యం. మున్షీగారును, భూమ్యాదాయశాఖమంత్రి మురార్జీ దేశాయిగారును, సర్దారు వల్లభాయి పటేలుగారును, వీధులలో తిరుగుచు ప్రజలు భయపడవలసిన అవసరమేమియు లేదనియు, ప్రభుత్వమువారంతయు కాపాడుచున్నా మనియు ప్రబోధించుచు తిరుగుచుండిరి.

## జకోస్లొవేకియాలో నాజీ ఖైదీల విడుదల

ప్రేగు: ఏప్రిలు ౧౭.

జకోస్లొవేకియా శాంతి సమావేశములో డాక్టరు బీన్సుగారు ఒక ముఖ్యోపన్యాసము నొసగిరి.

జర్మనీ జకోస్లొవేకియా దేశములమధ్య శాంతి నేర్పడియుండుటయేమనగ జకోస్లొవేకియా నమ్మకము, ఒకప్రభుత్వము వేరొకప్రభుత్వముయొక్క అధికారమును, స్వాతంత్ర్యమును గౌరవించవలెను, ప్రపంచములోని ప్రభుత్వము లన్నియు ఈసూత్రము ననుసరించవలెననని బీన్సుగారు పలికిరి.

జకోస్లొవేకియాలోని రాజకీయ ఖైదీలను ఇంచుమించు అందరిని విడుదలచేయవలసినదని బీన్సుగారు ఉత్తరువుచేసిరి దీనివల్ల ఆ దేశములోని సుడెటన్ జర్మను నాజీపార్టీకి బాలలాభము కలిగినది ఆపార్టీవారు వేయిమంది ఈ ఉత్తరువువల్ల విడుదల అయిరి.

## అలహాబాదులో అలజడి తగ్గుట

లేనిపోనివదంతులు ప్రకటించినందుకు పత్రికా సంపాదకులపై చర్య

అలహాబాదు: ఏప్రిల్ ౧౭

అలహాబాదులో కలహము జరిగి పోయినను అప్పుడప్పుడు లేనిపోని వదంతులు బయలుదేరుచున్నవి. అట్టివదంతులవలన ప్రజలు భయపడకుండుటకై యూనివర్సిటీలోని వారుచందాలు వసూలుచేసి వాడుక భాషలలో భయపడవలదని తెల్పు కరపత్రములు పంచిపెట్టుచున్నారు.

మతకలహముల సంబంధించిన వదంతులను ప్రకటింప కూడదని జిల్లా న్యాయాధికారి గావించిన ఉత్తరువుల నతిక్రమించినందుకు స్థానిక హిందీ, ఉరుదూ పత్రికల సంపాదకులగు మన్నిలాల్, షాఫీఉల్లా సైదీగార్లను ప్రాసిక్యూటు చేయవలెనని న్యాయాధికారి అజ్ఞాపించెను.

### న్యాయాధికారి ఉత్తరువులు

అంతట యూ క్రిందినోటీసు పై యిరువురకును యిచ్చిరి. "ఏప్రిల్ ౧౦ వ తేదిని ౧౪౪ సెక్షను ప్రకారము కలహముల గురించిన వదంతులను ప్రకటింపకూడదని అజ్ఞాపించియుంటిని. దీనికి మీరు వ్యతిరేకముగా ప్రవర్తించినందుకు ౧౮౮ సెక్షను ప్రకారముయూ నేరమునకు మిమ్ము ప్రాసిక్యూటు చేయ అజ్ఞాపించితిని. ఇకమీద నుండి అట్టి విషయములను మీరు ప్రకటించినచో మీపత్రిక ముద్రణమును పత్రికా ప్రకటనను సంపూర్ణముగా నిలిపి వేయవలసివచ్చునని హెచ్చరించుచున్నాము".

## ఫెడరేషను అలస్యమును కప్పిపుచ్చుటకు వైస్రాయిగారి యత్నము

కరాచీ: ఏప్రిల్ ౧౬

సెంట్రల్ అసెంబ్లీలో కాంగ్రెసుపార్టీ నాయకుడయిన భూలాభాయి దేశాయిగారు యూరపు పోవుచు విమానాశ్రయమువద్ద దిగగా కాంగ్రెసు ప్రముఖులు కొందరు స్వాగతమొసగిరి.

అసోసియేటెడ్ ప్రెస్ ప్రతినిధి ప్రశ్నింపగా, ఆరోగ్యము నిమిత్తము యూరోపు పోవుచున్నట్లు దేశాయిగారు చెప్పిరి. జూన్ ౨౦ తేదివరకు నుందురు.

సెంట్రల్ అసెంబ్లీ కాలపరిమితి పొడిగించుటను గురించి, రెండు కారణములచేత ప్రభుత్వమువారిట్లు కావించిరని దేశాయిగారు చెప్పిరి. మొదటి కారణ మేమనగా కాంగ్రెసువారు మెజార్టీగా వచ్చుట ఎలాగుమా నిశ్చయమే గనుక, ప్రభుత్వమువారు జనరల్ ఎలక్షనుకు సంసిద్ధులుగ లేరు. రెండవది అసెంబ్లీ రద్దుపరచినచో ఫెడరేషన్ వచ్చుట వెనుకబడినట్లు గందరగోళము బయలు దేరును.

## షాహిద్‌గంజ్ సత్యాగ్రహము

లాహోరు: ఏప్రిల్ ౧౭

మజ్లిస్ అహ్రార్లు షాహిద్‌గంజి సత్యాగ్రహము మొదలుపెట్టి నాలుగునెలలుముగిసెను. నేడు ఐదవనెల ఆరంభమైనది. ఇంతవరకు వేయిమందిపైన వాలంటీర్లు సత్యాగ్రహమున పాల్గొని అరెస్టయిరి.

నేడుమజ్లిస్ అహ్రార్ కార్యదర్శి డా. లాల్ దీన్ కాశ్మీరిగారి నాయకత్వమున ౨౫ మంది వాలంటీర్లు ఢింగారు మసీదువద్దనుండి సత్యాగ్రహము చేయుటకు బయలుదేరి ఢిల్లీ గేటుకడకు రాగానే పోలీసులు అరెస్టు చేసినారు.

సరిహద్దురాష్ట్రము రావల్పిండి షహపూర్ మరిలనుండి నేడు చాలమంది వాలంటీర్లు సత్యాగ్రహమున పాల్గొనుటకై లాహోరు వచ్చిరి.